

# రామకథా రసవాహిని

శ్రీసత్యసాయిబాబా

## 33

"అందులో వకవరము, తనకుమారుడైన భరతునకు పట్టాభిషేకము. రెండవది నన్ను పదునాలుగు సంవత్సరములు దండకారణ్యము పంపవలెననియూ అడిగినదట. ఇదీ జరిగిన విషయము" అని రాముడు తెలుపగనే,

కైక అట్టివరములు కోరినదా? నీవన్న కైకకు అమితమైనప్రేమకదా? ఆమె యేనాటికీ అట్టివరమును కోరదని నాభావము. పోనీ; కోరినది! రాజుగారిని పరీక్షించుటకై యుండ వచ్చును! అంత మాత్రమునకే ఇంత కంగారా?

వకవేళ ఆమెకోరినచో నీతండ్రి నిన్ను అరణ్యము

పంప వప్పుకొనునా? నేనునమ్మను. వకక్షణమైననూ నిన్ను చూడక వుండలేని నీతండ్రి పదునాలుగు సంవత్సరములు అరణ్యములో పెట్టునా? యేదో ఇదంతయూ నన్ను అయోమయ స్థితిలో పడవేయు చున్నది.

అయోమయము:

అని, ఆమె జరిగిన సత్యమును నమ్మలేక పోవుట చూచి, రాముడుతిరిగీ చేతులుపట్టుకొని, అమ్మా నామాటనునమ్ము! నాన్నగారు మొదలే ఆమెకు మాటనిచ్చి, తదుపరిఆమె ఇట్టివరములు కోరగనే, తనమాటను తాను వెనుకకు తీసుకొనుటకు ఆడినమాటను తప్పుటకు ఇష్టములేక, నన్నువీడుటకు అరణ్యమునకు పంపుటకూ మనసొప్పక, మహాబాధపడుచున్నాడు. ఈ బాధతోఅతనిని చూడలేక పోవుచున్నాను ఇప్పుడు నేనక్కడ నుండియే వచ్చుచున్నాను అతను ప్రజ్ఞలో లేడు ఘొరమైనబాధను అనుభవించుచున్నాడు.

వెళ్ళక తప్పదు

ఇది పరమసత్యము. నవ్వులకై నిన్నింత బాధపెట్టుటకు నేను అంతమూర్ఖుడను కాను పితృవాక్యమును నిలబెట్టుటకై నేనువెళ్ళక తప్పదు, తండ్రిఆజ్ఞ తీసుకొనే వచ్చితిని. ఇక నీఆజ్ఞకావలెను. అనిపాదములకు నమస్కరించిన రామునిచూచి కౌసల్య,

రామా! యేమి ఈ వికారభావము! యెట్టి కిరాతకు లైనను ఇట్టికోరిక కోరుదురా? కొన్ని నిమిషములలో పట్టాభిషిక్తుడు కానున్న నిన్ను కఠిన అడవులకు పంపుట మానవమాతృలు తలంచని తలపు కదా?

బ్రతికినంతకాలమూ నాకుబాధలేనా? యెన్నియో వ్రతములుచేసి కడకు కొడుకులభించెను కదా అని అనుభవించిన భాధలన్నింటినీ మరచి నా ముద్దు బిడ్డను చూచి ఆనందించు చుంటినే, యే సుఖమునూ నేను ఆశించలేదు, నా కొమరుడు నా చెంతనుండిన చాలునని కోరితిని. దానికికూడనూ నోచుకోలేనివాననైతి, కదా! కార డవులకు పంపుటకే నేను కొడుకును కంటినా? యే తల్లియైనా కొడుకును కారడవులకు పంపుటకు అంగీకరి మనా?

కలలు కల్లలాయెనా?

నేనేపాపముచేసితిని? యే జన్మములో తల్లిబిడ్డలకు యెడబాటు సలిపితినో, కదా? నీకు ఉపనయనము అయి నది మొదలు, నా కొమరుడు యేనాడు యువరాజు అవుతాడో అన్న భావము నాలో క్షణ క్షణమూ ఉత్సాహముతో యెదురు చూచుచుండెను. అట్టి నా కలలు కల్లలాయెనా? నా ఆశలన్నియూ అడియాసలయిపోయెనా? నేను నీకొరకై చేసిన పూజలు వ్రతములు హోమము లు వ్యర్థములయ్యెనా?

నేనెంత పాపినైతిని! నిజముగా ఈ వార్తవిని నా గుండె పగలకున్నదెందులకు? నేనింకా యేన్నిదుఃఖముల పాలు కావలెనో కదా? నాకు చావు లేదుకాబోలు. ఇంత దుఃఖవార్తవినియూ నా గుండె అదుచున్నది. ఇంతకూ కాలమువస్తేనే చావుకూడనూ వచ్చును. నన్నుచూచి ఆ యముడు కూడానూ వదలి వెళ్లుచున్నాడు కాబోలు! యమలోకమునకు కూడా నేను అర్హురాలను కాను కాబోలు, అని

హా! రామా! యేంతటిగతి సంభవించెనని క్రిందపడి పొర్లుచు గుండెలను బాదుకొంటూ విలపించు కౌసల్యను రామచంద్రుడు చూడలేకపోయెను; చుట్టూచేరిన దాసీల రోదనలు తనచెవులను బ్రద్దలుచేయ దొడగెను. రాముడు యెవ్వరితోనూ పెదవులెత్తి మాటాడలేదు. తల్లిని సమాధానముచేయుచూ తలనుసర్దుచూ, నేలలోని మట్టి తల్లి వంటి తగిలియుండగా దానిని శుభ్రపరచుచూ

సముద్రములో పాతుకొనిపోయిన గండశిలవలే అలలకు కదలక మెదలక వుండినటుల రామచంద్రుడు శోకమునకు కానీ ఆనందమునకు కానీ అతీతుడై నిలిచి యుండెను. పట్టాభిషేకమునకు యేట్టితేజస్సుతో ఉత్సాహముతో సంసిద్ధుడాయెనో, అరణ్య జీవితమును గడుపుటకు కూడా అట్టి ఉత్సాహముతో. తేజస్సుతో సంసిద్ధుడై యున్నాడు

రాముడు మహా దీక్షాపరుడన్నమాట కౌసల్యకు కూడనూ తెలుసు. రాముడు ఆడినమాట తప్పడనియూ తండ్రి ఆజ్ఞను జవదాటడని కూడనూ కౌసల్యకు తెలుసు. తానికయెంత విలపించిననూ రాముడు వెనుకకు తిరుగడనియూ అరణ్యమునకు తప్పక వెళ్ళుననియూ పూర్తితెలుసుకొని రామునికి అడ్డుచెప్పుటకు తాను యే మాత్రమును ప్రయత్నముచేయక మనసును గట్టిచేసుకొని

అన్నియూ మన మేలునకే

నాయనా! మనవ్రాత యిట్లుండ, వకరినని ప్రయో జనముండదు. అన్నియూ మనమేలునకే. దైవనిర్ణయమును యెవరునూ కాదనలేరు, నాకేనాడునూ ఈ అయోధ్యలో అంతఃపురములో సుఖములేదు, నేను అనుభవించనూ లేదు. కాన నా కుమారుడుండు స్థానమునందే నా సుఖ మున్నదికాన, నేననూ నీవెంటవత్తును, గొనిపొమ్ము అని లేవప్రయత్నించెను. అంతలో దాదులు ఆమెను పట్టుకొని ఆనించుకొని వోదార్చుచూ కూర్చొనబెట్టిరి. కౌసల్య మాటలనువింటూ

ఒకఆడదాని మాటః

ఆమెబాధను చూస్తూవున్న లక్ష్మణుడు తనమన సులోని భావములను అణచుకోలేక, మహా ఉగ్రుడై చేతులుకట్టుకొని కౌసల్యాదేవినిచూచుచూ, ఓపూజ్యురాలా!

వక ఆడదానిమాటకు లోబడి రాముడు రాజ్యమును వద లుకొని అడవులపాలుకావటమును నే నంగీకరింపను, స హింపను, తండ్రిగారు వృద్ధుడగుటచేత. మనస్సు స్థిమి తములేక, పైగా విషయ లోలుడున్నూ అగుట చేత కైకేయీప్రేరేపణకు దాసుడై మన్మథపారవశ్యములో పడి ముందువెనుక యోచించక ఏమైనా ఆజ్ఞాపించగలడు

అట్టి ఆజ్ఞలన్నింటినీ మనము పాటించరాదు; నిత్యా నిత్య పరిజ్ఞానములేని స్థితిలో వున్నరాజు రాజుకాజాలడు. అట్టివారి ఆజ్ఞ ఆజ్ఞకాజాలదు. కాకున్న రాజ్యములో కూడనూ వుండక, అడవులకు వెళ్ళగొట్టవలసినంత మహా పరాధము రాముడు యేమిచేసెను?

రాముని శత్రువులు కానీ అపరాదములు చేసి శిక్షనను భవించుచున్న కిరాతకులు కానీ లేరు; అట్టి వారు సహి తము రాముని చూపు నందైననూ దోషారోపణము చేసి ఎరుగరే! ఏవక్కడునూ యే వక్క దోషమూ ఎన్నడునూ రామునికి ఆపాదించి ఎరుగరే. అటువంటి నిరపరాధిని, నిర్మలచిత్తుని, పవిత్రపురుషుని అడవులకు వెళ్ళగొట్టుటలో యే రాజుకునూ అధికారము లేదు.

రాముడు ఋజువర్తనుడు జితేంద్రియుడు యెట్టి శతృవులనయిననూ అతడు ఆదరించును; ఆచరించెను. అట్టి సుపుత్రుని యెట్టి తండ్రి అయిననూ అడవులకు వెళ్ళగొట్టునా? అందులో మహాధార్మికుడు పవిత్రవీరుడు

సర్వధర్మప్రవర్తనుడు అయిన రాజు అట్లా ఆజ్ఞాపిస్తాడా? దీనిని పట్టిచూడ దశరథునకు మతిభ్రమణ అయివుండ వచ్చును, లేదా మన్మథపరవశుడు అయి వుండవచ్చు.

ఈ రెండుస్థితులలో వున్నవారి ఆజ్ఞ ఆచరణ యోగ్యముకాజాలదు. పిచ్చివానివలే యేమియూ తెలియని పిల్లవానివలే ప్రవర్తించుచున్న రాజుమాటలను మన్నించనవసరములేదు. రాజనీతిని మరచి లోకరీతిని విడచి పుత్రవాత్సల్యమునకు స్వస్తిచెప్పి ఉన్మత్తుడై చిత్తమును స్వేచ్ఛగా వదలి సంచరించే దశరథుని ఆజ్ఞ ఆజ్ఞగా పాటించుటలో నేనంగీకరింపను, అని లక్ష్మణుడు అంటూ రామునివైపున తిరిగి చేతులుకట్టుకొని రామా! నన్ను మన్నింపుము ఈ విషయము ఇతరులకు తెలిసేలోపలనే నీవు రాజ్యాన్ని స్వాధీనము చేసు కొనుము; నేను ధనుర్ధరుణ్ణి అయి నీ వెంట వుందును. నా ధనుస్సు పూజించుటకైలేదు; అయోధ్యానగరమున నిన్ను యెదిరించే వారిని దండించే ఈ ధనుస్సు వున్నది.

అట్లు యెదిరించు వారు మన అయోధ్యలోనే కాదు, యెందునూ లేరు; అట్లుకాక నిన్ను యెదిరించటమే జరిగెనా, నా ఈ తీక్షణ బాణములకు ఈ మహా నగరము నిర్మానుష్యమై పోగలదు.

వేయేటికి? భరతుడు, అతని హితమునుకోరే ఇంకా యెవరైనను కానీ నా మీదికి వచ్చునట్లయిన వారలనంద

రినీ నాశనముచేతును; కైకేయీ ప్రోత్సాహమువలన దశరథ మహారాజే శత్రుత్వము వహించి మనపైవచ్చెనా, ఆయ నను కూడనూ లెక్కచేయను; అతనిని బంధించి చెరసాల యందుంచుదును అని యింకా యేమేమో చెప్పబోవు చున్న లక్ష్మణుని చూచి రాములు

### ౫౧. దైవ నిర్ణయము.

లక్ష్మణా, మాటలు మితిమీరు చున్నవి. నా యిష్ట మును యెవరునూ కాదనలేరు నా సంకల్పమును యెవ్వరూ మార్చలేరు, నేను అడవికి వెళ్ళక తప్పదు. నా పైగల ప్రేమతో నీవు నా యెడబాటును భరించలేక ఇట్లు మాట్లాడుతున్నావు. శాంతము సర్వమునకూ రక్ష! నీవు శాంతమువహించు. తండ్రినికానీ సోదరుడైన భరతు నికానీ ద్వేషించకు. వారు పవిత్రులు; నిర్మలచిత్తులు.

కైకకూడనూ పరమ పవిత్రురాలు; పూజ్యురాలు. ఆమెకోరిన కోరికయందుకూడనూ యెట్టిదోషమునూలేదు. తన కొడుకైన భరతునికంటెనూ నన్ను అధికముగా ప్రేమించెను. చెంతచేర్చెను. ఆదరించెను. ఆడించెను. ఆనందించెను. అట్టి దేవి ఈ నాడు ఇట్టి లోకవిరుద్ధమైన కోరికెను కోరినదన్న ఇందులో యేదోవక అంతరార్థము లేకపోలేదు. ఇది దైవనిర్ణయమెకానీ పురుషకార మేమా త్రమునూలేదు. శాంతమును వహించి ముందుజరుగు దానిని విచారించమని బోధించెను.

అంత లక్ష్మణుడు రాములకు నమస్కరించి రామా! నీకు రావలసిన రాజ్యమును యేహేతువువలన కైకేయీ దేవి కుమారునకు కట్టపెట్టతలచెను? యేధర్మమును యేబలమును చూచుకొని అట్లాచేసెను? జ్యేష్ఠపుత్రునికి లేని అధికారము యేపుత్రునకున్నది? మీరు పితృప్రేమచే ఇట్టి మూర్ఖపు అజ్ఞలను సహితము శిరసావహించుచు న్నారుకానీ మీరెన్ని చెప్పినను నేనుసమ్మతింపను, అని కౌసల్యవైపునకు తిరిగి

ఓ దేవీ! నేను నిజముగా రామానురక్తుణ్ణి, సత్య ప్రమాణముచేసి చెప్పుదును. రామునివిడచి నేనొక నిమిష ముకూడనూ నిలువను. రామునికి ఒకవేళ రాజ్యాకాంక్ష లేక అడవులయందే నివసించుట ప్రీతిగాతోచిన, నేనుకూడా అతనితో వెళ్ళుదును. అతని అడుగుజాడల ననుసరింతు ను. అతనిని నీడవలె చూచుకొందును. అతడు అజ్ఞయేచే సిన, మండుటగ్నిలోనైననూ ఆనందముతో దుముకుదును,

నాకు రామాజ్ఞతప్ప అన్యులఅజ్ఞను నేను చెవియం దైననూ వేయను. అమ్మా! మీ దుఃఖమును నేచూడ లేను. మీకు కొమారుడైన, రామచంద్రుడు నాకు ప్రాణ ముతో సమానము. అట్టి ప్రాణమును వీడివుండుటకు యెట్టివాడునూ అంగీకరించడుకదా?

నీ బోటి సోదరుడు అరుదు

అని లక్ష్మణుడు చెప్పుచున్న పలుకులు కౌసల్యకు

కొంత శాంతిని చేకూర్చినవి. లక్ష్మణుని తలచుకొనుచూ కొమారా! నీ ప్రేమ నన్ను యెంతనో సంతోషపెట్టుచున్నది. నాకు నీ వచనములు మహాబలము నందించుచున్నవి. నీబోటి సోదరుడు లోకమున అరుదు. ఇట్టి పుత్రరత్నములను కన్నతల్లులు, మహా పవిత్రులని లోకులు తలంతురుకానీ, మేమెంత పాపము చేసితిమో అన్నబాధ మాకు తప్ప అన్యులకు అర్థముకాదు. రాముడు తనపట్టును వీడడు; అతనికి వెళ్ళకతప్పదు. కాన నన్నుకూడా మీతో గొనిపొండు అని విలపించినది, కౌసల్య,

( సశేషము )



వేదాధీశ్వర వేదసారవిదుషా వేదాంగ విద్యాధరా
ఆదర్శా అమలేశ్వరా అగణితా అవ్యక్త రూపాన్వితా
ఔదార్యా అపురూప శక్తి విభవా ఆశ్చర్య చేష్టాన్వితా
ఆదిత్యా అఖిలేశ్వరా గుణవరేణ్యా సత్య సాయీశ్వరా
భారద్వాజసగోత్ర సంభవ కృపాపారీణ దీనావనా
సారజ్ఞా సకలార్థసార విభవా సౌజన్య శీలాన్వితా
మారాకార మనోహరా సదమలా మందస్మితా మంజులా
శ్రీ రామా రమణీయరూప విభవా శ్రీ సత్య సాయీశ్వరా

—०ॐ०—

# మధుర క్షణం

కదుము కట్టిన కళ్ళతో
చెదరి పోయే మనసుతో
ఎన్ని గంటలనుండి వేచినామో!
ఎన్ని జన్మలనుండి వెదకినామో!
ఎదురు చూసే కనులలో
ఆనంద సాయిపై
చెదరే చిరు హృదిలో
మమతల సాయిపై
తృటిలో తలుపు తీసి
చటుకున తెరల తోసి
మృదు హస్తాలతో
అతి సుతారముగా
ఎఱ్ఱని అంగీ
అల వోకగా ఎత్తి పట్టి
పుడమిపై అడుగు లిడ
నేర్పిన చిరు బుడుత నిలా
ఇటు నటు ఊగుచు, తూగుచు
చిరు చిరు పలుకులు
తేనియ సోన లట్లు చిలకరించుచు
చిరు నవ్వు మోముతో
లేత పాదాల ముందుకు కదుపుచు
అరుదెంచే సాయి రామా!

ఒక్క క్షణం — మరొక్క క్షణం
ఇంకొక్క క్షణం — అలాగే
అక్కడే ఆగిపో
హృదయాభి రామా!
హృదయంలో ఉప్పొంగే
ఆనంద కెరటాలు నర
నరాల ప్రవహించే లోపలే;
లయ తప్పిన ఈ హృదయం
స్థిమిత పడి, నీ రూపం.
ప్రతిష్ఠించు కునే లోపలే;
కనుల కరువు తీర
తృప్తిగా విను కాంచులోపలే,
నీ పవిత్ర పాద యుగళిని
భక్తితో స్పృశించి కనులకద్దుకోనీ:

* * * *

ముద్దులొలుకు ఆ చరణ కమలముల
ప్రేమతో వంగి చుంబించవలెనా!
ఏది నీకు ప్రియము, స్వామి
ఏది ఇపుడు తగును?
అను ఈ సమస్య తీరక మునుపే
ఏదీ ఇంకా చేయక మునుపే
నెమ్మదిగా సాగి పోకు
స్వామీ నా ముందు
నుంచే నడచి పోకు,
ఒక్క క్షణం నను తెప్పరిల్లనీ
ఒక్క క్షణమే నను సాగిలబడనీ

నీ చూపుల వెన్నెల నాపై
అమృతమై ప్రసరింపనీ
నీ మోహన రూపం నాలో
శాశ్వతంగా నాటుకోనీ
నా హృదయమును నీ
కర్పింపనీ స్వామీ!
నీ నామమును నన్ను
జపియింపనీ...!
వదలి పోకు స్వామీ!
చిరు నవ్వులు చిందించుచు
నిర్దయతో నను
వదలి పోకు స్వామీ!
స్వామీ! ! ! !

* * * *

అయ్యో వెళ్ళి పోయావా!
ఒక్క మధుర క్షణాన్ని
నాకు వదలి పోయావా!
నా జీవితంలో ఒక
నవోదయాన్ని చూపి పోయావా!
బ్రతుకంతటికి సరిపడు
ప్రేమార్ద్రతలను
నింపి పోయావా!

* * * *

లేదు లేదు
నీవు ముందుకు పోలేదు;
ఆ మధుర క్షణం

ఆ సంతృప్తి నిండిన ఒక్క లిప్త
నా మదిలో ఆగిపోయింది
నీ ప్రేమ స్వరూపం
నాలో నిండి పోయింది.
ఆ ఆనందోదయానికి
అస్తమయం లేదు
ప్రతిక్షణం జ్ఞానోదయమే
కలిగిస్తోందది:
నను కరుణించిన
నా స్వామి
నన్ను వీడి — పోలేదు

జీ. విశారద

యంత్రము వేరు, మంత్రము వేరు. మానవుడు నిర్మించునది యంత్రము; మానవుణ్ణి నిర్మించునది మంత్రము. మంత్రము అంతర్ముఖమైనది; యంత్రము బహిర్ముఖమైనది, కనుకనే బాహ్య పరిశీలన జరుపే వాడ్ని సయన్‌టిస్ట్ అంటున్నాము; అంతర్పరిశీలన సలుపేవాడ్ని సెయింట్ అంటున్నాము. ఈ సెయింట్లు నియమించిన అనుభవించిన అందించిన దివ్యనామమును హృదయ పీఠమునందు ప్రతిష్ఠించిన, దానికి తగిన నిబంధనలను శ్రద్ధగా పాలించిన, పవిత్రమైన దివ్య జ్యోతి ప్రకటితమగును.

బాబా

# పూర్ణ చంద్రుడు



భారతదేశము పరమ పునీతమైన ఆధ్యాత్మిక క్షేత్రము. గురుశిష్య సంప్రదాయము ఈ దేశపు సంస్కృతియొక్క ప్రధాన లక్షణము. అన్యదేశములలో ఇట్టి పవిత్ర సంబంధము కన పించదు. అవతార పురుషులు, రామ కృష్ణాదులు కూడా, లోక సంగ్రహార్థమై, ఇట్టి సంప్రదాయము ననుసరించి ప్రజలకు నిదర్శనములను ప్రబోధించుచూ వచ్చారు. గురువు నేర్పించు పాఠము యథార్థ పాఠముగా వుండవలెను, పరమార్థమును గుర్తించినదే నిజార్థము. మిగిలినవన్నీ వ్యర్థము; మానవత్వమే దానివలన వ్యర్థమగును. జాతి భేదములేక జనులందరికి ఆశ్రయ మిచ్చి పోషించి తరింపజేసిన దేశమిది. నాది, నేను, అనే మమకార అహంకారములను వదిలితే చాలు, మోహము నాశ మొందినీ, మోక్షప్రాప్తి యగునని బోధించిన దేశమిది.

అయితే, నిత్యసత్యమైన తన దివ్యత్వమును గ్రహించే నిమిత్తమై మానవుడు అనిత్యము అసత్యము అయిన ఈ దేహములో నివసించే ప్రాప్తిని పొందినాడు. దోషసహితమైన అశాశ్వతమైన ఈ చర్మచక్షువులద్వారా ఆ సత్యమును సంద ర్శించేది సాధ్యముకాదు. దానికి జ్ఞాననేత్రము కావలెను. ఆ జ్ఞాన నేత్రమును సంపాదించు విధానమే ఆధ్యాత్మిక మార్గము; ఆ మార్గమును సందర్శింపజేసి ప్రయాణమున కుత్సాహపరచి తోడునీడుగావుండి గురిని సాధించేకొరకు సాయపడేవారే గురువులు.

పుట్టిన శిశువును ప్రేమతో పెంచి, తగురీతిగా కాపాడి

బుద్ధి చెప్పి నేర్పించే తల్లి తండ్రులే, ప్రథమ గురువులు. విద్యాబోధకులై విజ్ఞానము నభివృద్ధిజేసి, మనోబుద్ధులను తీర్చి దిద్దేవాళ్ళే తరువాత గురుస్థానము నలంకరించువారు.

బాహ్య ప్రకృతిని గురించి యెంత తెలుసుకొనిన, దానిపై వ్యామోహము నెంతపెంచినా, ఇంద్రియములద్వారా యెంత ఆరాటపడి సుఖము వార్జించిన, ధనకనకాదులను యెంతప్రోగుచేసిన, అవన్నీ సత్యస్వరూపుణ్ణి దర్శింపజేయవు. తనను తాను తెలుసుకొని, తన దివ్యత్వములో లీనమై ఆత్మానందము ననుభవింప జేయు గురువులే నిజగురువులు. దేహం నాహం, అనేది ప్రథమ సోపానము; దాన్ని ఆరోహించిన తరువాత, కోహం అనే ప్రశ్న బయలుదేరును. దానికి సమాధానముముగా సోహం అనితెలుసుకొన్న తరువాత కూడ సః అహం. వాడు నేను, అనే రెండులేవు, నేనేవాడు, వాడేనేను; ద్వైతములేదు, అద్వైతమే పరమసత్యము అని అనుభవమునకు తెచ్చుకొనేదే, సాక్షాత్కారము; మోక్షప్రాప్తి.

దేహమనేది ఘటము; తాను ఈ ఘటమునకు భిన్నము. దాని వర్ణము నామరూపములు జాతిమతములు- వీటికి తనకూ సంబంధమే లేదు. అవన్నీ దృశ్యములు; ద్రష్ట వేరుగావున్నాడు సర్వమునకూ సాక్షిభూతుడైన ద్రష్ట, ఆ పరమాత్ముడే కాని వేరు కాదు. ఆ పరమాత్ముడే ఈ ఘటములోని జీవాత్మ, అనే సత్యమును గుర్తించి వర్తించువాడే సార్థక జీవితమును నడుపువాడు. కాన తాను స్థూల శరీరముకాదు, లింగశరీరముకాదు, కారణశరీరమూకాదు; ఆ పరమాత్ముడే తాను అని ఉపదేశించి నిర్దేశించి దర్శింపజేసే

గురువు భగవంతుడు తప్ప వేరుకాదు; దానికే గురుర్బ్రహ్మ, గురుర్విష్ణు, గురుదేవో మహేశ్వరః గురుస్సాక్షాత్ పరబ్రహ్మ, అని నుతించడమైనది.

గురుపౌర్ణమినాడు ఆ సచ్చిదానందములో లీనమయ్యే, తన దివ్యత్వమును ప్రకటించే, ప్రయత్నములో ముందడుగు వేయవలెను; అదే దానిపవిత్రత. గురు అనే పదమునకు గుణాతీతుడు రూపరహితుడు అయిన మార్గ దర్శకుడు, అనేదే అర్థము; గు అన్న అంధకారమును, అజ్ఞానమును రు అన్న నివారణము చేయువాడు అనే అర్థముకూడ వున్నది. అయితే, ఈ నాడు మూడురకములైన గురువులు కనుపింతురు. వారిలో విత్తాపహారులు అధములు, చిత్తాపహారులు మధ్యములు, తాప హారులు ఉత్తములు.

దుర్భావము దుశ్చింత దురోృధలు లేని జీవితమే పూర్ణ జీవితము. నెరవేరవలసినది తన అభీష్టమా, పరమాత్మని అభీష్టమా అని విచారణ సలుపవలెను: నెరవేరునవన్నీ పరమాత్మని సంకల్పమే అని తెలియవలెను. తాను దైవస్థానమునకు పయణించిచేరవలెనుకానీ తనస్థానమునకు దైవమునులాగకూడదు. You may worship a picture as God, but not God as a picture. దైవమును పేపరుగా రాయిగా బొమ్మగా చక్కగా పరిగణించేది వికారమార్గము, అజ్ఞానము; అయితే సర్వాంతర్యామి సర్వ భూతాంతరాత్మ, తాను తప్ప యెక్కడనూ యెప్పుడునూ యే వస్తువూ లేదు. యే శక్తియూ లేదు, రాదు, అనే దాన్ని పట్టి పిక్చరులోనూ తానే, రాయిలోనూ తానే, బొమ్మలోనూ తానే

అనేది సరే. దైవశక్తి దైవస్వరూపము ఒక ప్రత్యేక ప్రదేశ మందున్నది. ప్రత్యేకస్థానములో ప్రత్యేకముగా ప్రకాశించును అనే భావనకూడ ప్రప్రథమములో ప్రయోజనకారిగా నుండవచ్చునేమో కానీ అంత్యమువరకూ దానిని పట్టుకొనుటకు పూనుకొనకూడదు.

దృక్కు వేరు; దృశ్యము వేరు. తన్ను దృశ్యమయినపుడు మనస్సు దృక్కు; మనస్సు దృశ్యమైనపుడు, బుద్ధి దానిదృక్కు; బుద్ధి దృశ్యమైనపుడు ఆత్మ దృక్కు. మనస్సును దృశ్యముగా తెలుసుకొని, ఆత్మను గుర్తించేది సాధనయొక్క ముఖ్యలక్షణము. చంచలం హి మనః కృష్ణ ప్రమాదీ బలవత్ దృఢం, అని అర్జునుడు మనస్తత్వమును గురించి వివరించెను. చంచలత్వము చాలా ప్రమాదకరమైనది. చంచలత్వముబలముగా దృఢమయినది.

డిల్లీనుంచి వచ్చిన భక్తుడొకడు ఉదయం నన్ను ఒక ప్రశ్న అడిగినాడు. ఇంత భద్రముగా పాతుకొనిపోయిన ఇంత శక్తివంతమైన ఈ మనస్సును సులభముగా అరికట్టే ఉపాయమున్నదా అన్నాడు. ఉన్నదన్నప్పుడు ఆయన, స్వామి! అట్లు చెప్పవచ్చునే కానీ మనకు దానిననుసరింప వీలుకాదన్నాడు; లేదు లేదు ఇంతకంటేకష్టతరమైన పనులంతామానవులు చేయుచున్నారు. నల్లటిపెద్ద తుమ్మెదను మీరు చూచియుందురు కదా? అది కఠినమైన కర్రలో కూడ రంధ్రముపేయును; కర్రునితొడను ప్రవేశించే శక్తిగలిగినది అది! అయితే వికసించిన కమలమును ప్రవేశించి మకరందమును త్రాగిన తరువాత ఆ కమలము ముకుళించిన,

లేతరేకలను చీల్చుకొని బయటకు రాలేక పోవుచున్నది: తనశక్తిని భక్తిగా మార్చుటమువలన దానికి కమలవాసము దొరికినది. భగవంతుని పాదపద్మమునందున్న మకరందమును గ్రోలితే, ఆ భక్తివలన ఉన్మత్తులై ఆ ఆనందములోనే లీనమైపోదురు.

మనసునందు మాలిన్యములేక, పవిత్రప్రకాశము కలిగిన, అన్ని దినములూ పౌర్ణమీ దినములే; పూర్ణిమాచంద్రుడు మానవులకు చక్కని బోధనిచ్చును: తెల్లగా చల్లగా అందరికీ ఆనందమునిచ్చు సుందరస్వరూపుడే చంద్రుడు; యెంతో మంది మహా తెలివితో విద్యావంతులై శక్తి సామర్థ్యములను సంపాదించి యున్నారు. వాళ్ళుకూడ పశుపక్షి మృగాదులనుంచి మంచి పాఠమును నేర్చుకో వలసియున్నది. వృక్షములు గొడ్డలితో తమకొమ్మల కొట్టి నాశనము చేయువాళ్ళకే నీడనిచ్చి ఉపశాంతి నందించుచున్నవి. అయితే మానవులు ఉపకార మొనగువాళ్ళకే అపకారమొనగి కృతఘ్నులగుచున్నారు. ఇన్ని అనుకూలముల నందించు దైవమునకు కృతజ్ఞత నందించక తీరని అపకీర్తికి గురియగుచున్నారు. యెన్ని ప్రవాహములు వచ్చిపడినా, యెంత యెండ కాచినా కాలినా యెంత ఆవిరి లేచి పోయినా సముద్రము పొంగక క్రుంగక యేకభావముతో మెలగుచున్నది. సంసార సాగరముకూడ అంతియే. అనంతమైన అగాధమైన సాగరము తనపైన నే చిన్న చెత్తపడినా దానిని సహించక అలలతో గట్టుకు నెట్టివేయును; అయితే మానవులు అట్టిదోషములను కల్మషమును నెట్టివేయుటకు పూనుకోవటములేదు. మరొకటి: సముద్రము

యొక్క పైభాగము విశ్రాంతిలేని అలలతో అశాంతిగా కనుపించినను, అడుగుభాగము మాత్రము చలించక, ప్రశాంతముగా వుండును. అట్లనే యెన్నిబాధలు కష్టనష్టములు ఇష్టప్రాప్తి అనిష్టప్రాప్తి సంభవించిన, హృదయస్థానమునందు విశ్చలముగా నిర్మలముగా వుండవలెను. విచారమునకు దూరమై సత్యమునకు దగ్గరవారె పోవలెను. దుఃఖము విచారము కష్టము ఇవి మానవులకు నిజమైన గురువులని మీరు చక్కగా అనుభవరూపమై తెలిసికొనవలెను. సుఖము దుఃఖము రెండూ ప్రత్యేకముకావు, ఒకటి నుంచి ఒకటివివిడదీసేది సాధ్యముకాదు. కాబట్టి, యేదిలభించినా యేది లభించక పోయినా, పూర్ణచంద్రునివలె ఆనందముగా, ప్రశాంతముగా ప్రకాశముగా మెఱుగుటకు ప్రయత్నముచేయండి. అట్లుచేసిననాడే పూర్ణిమా, అ పూర్ణత్వమే మీ గురి అని బోధించినవాడేగురువు. దానిని సాధించి ఆనందించిననాడే గురుపౌర్ణిమా.

(శ్రీవారి దివ్యబోధ)—28-7-72



# దైవసాన్నిధ్యము

భజ గోవిందం, భజ గోవిందం, గోవిందం భజ: మూఢ మతే: ....భజన? భజన అనగా యేమి? అది యేరీతియున్న మనోరంజనముగా, ఆనందదాయకముగా, భగవత్ ప్రీతిగా, ఫలకారిగా అగును?

భగవాన్ బాబావారే దీనిని పలుమారు తమ దివ్యోపన్యాసములలో వ్యక్తపరచియున్నారు, కదా? మహా మహిమాన్వితము, కరుణా పూరితము అయిన భగవానుని దయామృత వర్షమును మనపై యించుక చిలికించమని ఆవేదనతో ప్రార్థించటమే భజన; పరిశుద్ధమైన భావనలను ఉదాత్తమైన ఉత్సాహమును భజన గానము కలుగ జేయును; పాల్గొను వారందరికీ మేనులు పులకరించును; నిలువెల్ల ఆనంద వాహినీలుప్పొంగి పొరలి లోన వెలుపల చుట్టూ సంతోష సంతుష్టి ప్రేమ తరంగములు చిందులు వేయును. ఆనందముగా భావరాగతాళములతో నామావళులను పాడుటకు పురిగొలిపి, పాడుచున్నవారికి వినుచున్న వారికినీ భగవత్ శక్తి, భగవన్మహిమాతిశయములు అతని లీలాగుణ విశేషణములు, అతని అపారకరుణ, కండ్లకు కట్టినట్టు తన్మయ పరచు అనందానుభూతే, భజన. భజనలో భావమే ముఖ్యము: దైవప్రీతికొరకు భజన సలుపండి: మానవుల మెప్పు కొరకు కాదు"

"మరుపురాని మధురానుభూతియే భజన. నామియొక్క సన్నిధికి చేర్చు నావ నామము: మీ హృదయములు దయతో కరగి

భక్తిభావముతో పరిశుద్ధమై ప్రేమతో పొంగినపుడు, నాకు చాల ఆనందము కలుగును; ఆనందోద్రేకముతో పాడండి, అంతేచాలు'' ''అర్థమయ్యేరీతిగా ఆనందము తొణుకు లాడేటట్టుగా భజన చెయ్యాలి'' అన్నారు, స్వామి. ''యాంత్రికముగా గ్రామఫోను ప్లేట్లవలె టేప్‌రికార్డులవలె భజనలు పాడితే నాకేమాత్రమూ తృప్తి యుండదు'' అని హెచ్చరించారు.

భజనలలో ఆర్తిలేదు, ఆవేదనలేదు, చిత్తాకర్షణలేదు: నిర్జీవముగా నిరుత్సాహముగా నున్నవి. విచారకరమైన రాగములు వరుసలు పెట్టి పాడుచున్నారు; ఒకే లైనును మరీ మరీ పాడుట వలన రసహీనమై పోవుచున్నది. క్రొత్తపాటలను సామూహిక భజనలలో పాడితే, అదొక రిహార్సల్ రీతిగా జరుగునే కానీ అందరూ కలుసుకొని పాడలేరు. పనిలేని మనస్సు పరుగులు పెట్టును, అని బోధించియున్నారు.

నేను భారతదేశములోనూ అమెరికాలోనూ చాలా భజన సమావేశములలో మనవాళ్ళతో కలుసుకుని పాల్గొన్నాను; కొన్ని సందర్భములలో నేనే భజనలను పాడుటకూడ సంభవించినది. అందరికీ కాకున్న, కొందరికైననూ, ఆ భజన కార్యక్రమములు ఉల్లాసము ఉత్సాహము కలిగించలేక పోవుచున్నది. తపస్సు కాకపోగా తమస్సుగా పరిణమించుచున్నవి. సాయిభక్తులమైన మన మందరమూ సామూహిక నామసంకీర్తన కార్యక్రమములను మెరుగుపరచి భగవత్సాన్నిధ్యమును పొందుటకు పూనుకోవలెను. బాబావారి ప్రీతిపాత్రుల మగుటకు ప్రయత్నించవలెను. కరుణా

సముద్రులైన శ్రీవారి ఆదేశముకూడ అదియే. ఆ ఆదేశానుసారము భజనఅనే సాధనను జరుపునపుడు కొన్ని విషయములకు ప్రత్యేక శ్రద్ధవహించ వలసియున్నది.

పాల్గొనువారు

సామూహిక సమావేశములలో భజనపాడి పాడించవలెననిన, అనుభవముండిమే తీరవలెను. గానమాధుర్యముచే వినువారిలో నిరహంకారము, ఆనందము, కృతజ్ఞత మొదలగు దైవీ భావముల నభివృద్ధిపరచి, అహంకార మమకారములను ఆ భావములో లీన మొనరించవలెను. భక్తుని ఆకాంక్ష ఇదియే. ధ్యానమునకుకానీ జపమునకుకానీ సాధుసంతుల సేవకుకానీ నిశ్చల నిర్మల నిస్వార్థ మనోభావముతో పూనుకో వలెను. సమావేశమునకు చాలా అణుకువగా, శాంతముగ చేరవలెను; కొన్ని గంటలకు ముందుగనే, భుజించవలెనేకానీ నిండుకడుపుతో రాకూడదని చెప్పనక్కరలేదు. ఆకలితో బాధపడుచూ భజనలు పాడితే యేమి లాభము? ప్రశాంత చిత్తముతో, సకలమానవ సమరస భావముతో రావలెను. చింతలతో మనస్సు చంచలమై ద్వేషాసూయపూరితమై యుండిన, తనకు మాత్రమె కాదు, ఇతరుల ప్రశాంతతనుకూడ భంగపరచును, పనుగు [illegible]చారములను పుట్టించును.

గదిలో సన్నని వెలుగు మాత్రముంచి బాబావారి పెద్ద చిత్రపటమొక్కటిపై మాత్రం అందరికీకనబడునట్లు, వెలుగుదానిపై యెక్కువ ప్రకాశముగా పడునట్లు, అలంకరింపవలెను. విచిత్ర

ము నుంచి శ్రీవారు సూటిగా మనలనే చూచునట్లుండవలెను; అపుడే దానిపై మనోదృష్టులను యేకాగ్రపరచుటకు వుపకరించును. చిత్తమును మెత్తపరచు రాగములలోని తంత్రీవాద్య గానములను వినిపించిన ప్రశాంత వాతావరణ మేర్పడును. భజనకై వచ్చే సోదరులను సాదరముగా చిరునవ్వుతో చిన్నగ పలుకరించి ప్రేమను ప్రకటింపవలెను. హార్మోనియం, మృదంగము, మొదలగు వాయిద్యములను జనులు కూడక ముందుగనే శ్రుతిపరిచేసి యుంచుకొనవలెను, కానీ అందరిముందు శ్రుతిచేయుటకు ఆరంభించకూడదు. అది వీలుపడని పక్షమున ప్రక్కగదికైన పోయి సరిచేసు కొనవలెను.

## పాటలు

భజనలలో పాడే నామావళులు కీర్తనలు చిన్న చిన్న పదములతో కూడి సులభ సుందరమైన వరుసలతో అందరూ సునాయాసముగా అందుకొని నాలుకపై నాట్యమాడించునట్లు మృదు మధురముగ సరళభావముతో నిండియుండ వలెనని శ్రీవారు తరుచు తెలుపుచునే యున్నారు. అయితే సాధారణముగ, పెద్ద పెద్ద సభలలో కూడ, దీనిని అందరూ పాటించక పోతున్నారని చెప్పకతప్పదు. భక్తిభావభరితమైన భజనలే భగవంతునికి ప్రీతి కలిగించును అని తెలుపుతూ, శ్రీవారు వక కథనుదహరించిరి. భద్రాచలం రామదాసు చాలపాటలను రచించి వాటిలో ఏవి శ్రీరామునికి నచ్చినవని నిర్ణయించుకొనుటకు వాటినన్నిటినీ గోదావరిలో పారవేసి, రామదాసు "రామచంద్రా! నీకుసంతృప్తి

కలిగించిన పాటలను ఎన్నుకొనుము'' అని వేడినాడు. అంతటి వాటిలో 108 కీర్తనలు మట్టుకు నీటిపైకి తేలి, మిగిలినవన్నియూ మునిగిపోయినవి; ఆ 108 ని మాత్రమే తాను హృదయపూర్వక ముగ వ్రాసినవని, మిగిలినవన్నియూ పాండిత్య ప్రకటణ, శబ్ద జాలము, మాటలచమత్కృతి అని, బుద్ధికుశలతవలన వెలువడిన కీర్తనలు భగవంతునికి నచ్చవని, గ్రహించెను.

మన భజనపాటలు, నామావళులగానము హృదయ కుహర మునందు వెలువడినవా? లేవా? అవి మనమెట్లు గ్రహించగలము? శ్రద్ధగావివి పాడ ప్రయత్నించు భక్తునికన్న మనకువేరు పరీక్షించు మార్గములేదు. ప్రగాఢమైనభక్తితో మధురకంఠముతో రాగతాళ లయబద్ధముగా భజనపాడిన, ఆభజన వినువారిలో ఉత్సాహము కలుగించక, బలహీనముగా యాంత్రికముగా భజనజరిగిన అట్టి కీర్తనలకుకానీ నామావళికికానీ, సామూహిక భజన కార్యక్రమము లలో స్థానమేలేదు. అందరి హృదయవాసి అయిన సాయిని ఆనందపరచగల రచనలే పాడవలెను. అందరి ఆనందమే సాయికి హాయి. ఇదియే మనము గమనించవలసిన కొలబద్ద, దీనినే లక్ష్య మందుంచుకొని, మనసా వాచా కర్మణా సత్యపథమును వీడక, ఏఅడ్డుకానీ ఏఆటంకముకానీ యెదురైననూ చెదరక బెదరక, సాగిపోవలెను. దైవ సంబంధ విషయములలో రాజీన్యాయము పనికిరాదు అని శ్రీవారు నాతోనకసారి చెప్పినారు భజనలు మనలోని భక్తిప్రపత్తులను జాగ్రతపరచి, భగవంతునిపై కృతజ్ఞతా భావమునుపెంచి పోషించవలెను. పాటలలోని మాటలు, వాటివరుసలు, తేలికగనూ, సులభ గ్రాహ్యముగనూ

వుండవలెను. కొంత చక్కనివైననూ, కఠినమైన కీర్తనలను పాడవలెనని వాంఛించువారికి నేనొక సలహానందించ దలచితిని: బహిరంగ సమావేశములందు, చాలమంది కొత్తవారున్నపుడు, ఆపాటలనుపాడి అభ్యాసమున్నవారు అందరూ ఒకేచోటగుంపుగా కూర్చొనక, సభాస్థలమందు అక్కడక్కడ ఇద్దరు ముగ్గురుగా కూర్చొని, గట్టిగా ధైర్యముగా ఆ నామావళులను కీర్తనలను పాడిన, చుట్టు వున్నవారుకూడ వాటిని అందుకొని అర్థము చేసుకొని పాడగలరు. అటులలేనియెడల కొత్తవారికి ఆపాటలు వినపడిననూ తెలుసుకొని తాముపాడలేరు. ఈపద్ధతివలన మంచి ఫలితము కలుగును. భజనలలో పాల్గొనలేక, మూగగా దిక్కుల చూచు భక్తుల బారులలో పూజ్యభగవాములు తిగుగుట, కొత్తగా భజనకు వచ్చినవాళ్ళకు దానిలో పాల్గొని ఆనందమునందుకునే అవకాశము లేనట్లు చేయుట, ఇవి మంచిదికాదు, కదా?

పాట, పైస్థాయికి వెళ్ళినకొలదీ వెంట పాడువారు ఆస్థాయిని అందుకొనలేక, యేదో, తప్పదురా దేవా, అని కష్టముగా గొంతు చించుకొని పాడెదరు: అట్టిభజనలు బ్రహ్మానందమును కలుగింపక, బండబరువుగా, వృధాశ్రమగాను వుండును కొత్త భజనలను ముందుగా పాడుకుని పరీక్షించి బాగు.గావున్నదని అనిపించిన మీదటనే బహిరంగ కార్యక్రమములలో పాడవలెను. కొత్త వారినెత్తిన కొత్తకవిత్వములను రుద్దిన వారి ఉత్సాహమునశించి చిరాకు పొందెదరు. శ్రీవారు పాడినేర్పించు భజనలకు రాగతాళ ములను కొంతమంది మార్చిపాడుట నేనుకొన్నిచోట్ల గమనిం

చితివి. దీనివలన వాటిమాధుర్యమే చెడిపోవుచున్నది. ఇంక మృదంగము మొదలగు వాయిద్యములను బిగ్గరగా కొట్టిన, గానమే వినిపించదు; భజన మూడవతాళము, నాల్గవతాళములో పాడుటకారంభించి, మధ్యలో మార్పు చేయుదురు. దీనివలన పాటకు తాళమునకు సామరస్యములేక అస్తవ్యస్తమగును. మనో లయముకాకపోగ, చికాకు కలుగును. రాగతాళబద్ధమైన కదా, సంగీతము రక్తి కట్టునది

### ఫలితము

భజనలలో పాల్గొన్న తరువాత, మనఃస్థితిలో ఏకించిత్తైనా మార్పుకలిగినదా, అనిపరీక్షించవలెనని చాలామార్లు శ్రీవారు హెచ్చరించియున్నారు, కదా? పూర్వపు మాదిరే ఈర్ష్య అసూయ కలహ ప్రీతి, పరనిందాసక్తి, ఆత్మస్తుతి మొదలగు దుర్గుణములే మిగిలి యున్నవా? నిర్మలమైన ఉదాత్తదృష్టి కలుగలేదా? సాటిమానవులలో వెలుగుచున్న దైవత్వమును వీక్షించి ఆనందించుచున్నారా? మాటలుతగ్గి, సేవాసక్తిపెరిగి మునుపటికన్న మిన్నగా పరులను శత్రుమిత్రులనే భేదభావములేక ప్రేమించ కలిగిన భజనసాధన ఫలించినటులే.

భజనచేయు సమయమందు ఏవిధముగా ప్రవర్తించెదమో తదుపరి ప్రవర్తనకూడ అంత ప్రాముఖ్యమైనదేను. సమావేశ స్థలములో ఆకాలములో యెవరిపైగాపీ కటువుగా కసురుకొనుట డాంబికముగా మాట్లాడుట తగదు. వ్యాపారవిషయము రాజకీయ విషయములు లౌకికసంగతులు జ్ఞప్తికి రాకూడదు.

సత్సంగ ఫలితముగా దృష్టిదోషము వాగ్దోషము శ్రవణ దోషము క్రియాదోషములు దూరముకావలెను. కర్తవ్యకర్మల నాచరించుచే దైవారాధన అనేభావము దృఢమగును. పూర్వముకన్న లోతుగా నిష్కర్షగా ఆత్మపరీక్షచేసుకుని సాధననవలింబించవలెను. భజన ఒక దివ్యానుభూతి; దాని ఫలితముగ శాంతిప్రేమలను పొందిసుఖింతుము. భజనలో కొంతసేపైననూ దైవసాన్నిహిత్యమును అనుభవించ కలిగెదము. ఈఅనుభూతిని ఆధారము చేసుకొని, ఆసాన్నిధ్యమును సర్వత్ర సదా అందుకొని ఆనందింతుము. బాబావారు మనకు చేయూతనిచ్చి ఆశీర్వదింతురుగాక।

భృంగము



# అవతార రహస్యము



అనంతమైన భగవత్శక్తి భగవద్ లీలాగుణ గణ విశేషములలో అంతో ఇంతో కొంతైననూ స్మృతికి తెచ్చుకొని ఆనందముతో చింతించిన, భగవంతునిపై భక్తిశ్రద్ధలు కలుగును; భగవత్ సృష్టిపై పూజ్యభావము పెరుగును; సర్వజీవులూ భగవదంశములని తెలియును; వారిపై ప్రేమభావము పుట్టును. ఆప్రేమద్వారా భక్తి సోపానమును క్రమముగా అధిరోహించి భగవదనుగ్రహమును సంపాదించి తరించ వీలగును.

అయితే, ప్రేమతత్వమును గుర్తించక, కామముయొక్క-

వశులోవడి, కోరికలకు బానిసలై. కామమునకు తోడుగావచ్చు క్రోధమునకు వశులై, మానవులు దానవులగుచున్నారు. ఆకారము మానవాకారమైనప్పటికీ దానవత్వము ఆవరించి, మానవత్వము నకే మసిపూసి నట్టగుచున్నది.

మానవత్వములో దైవత్వమున్నది అవి ప్రకటించుకొరకు, అవతారములు మానవాకారమును ధరించును. నిర్గుణ నిరాకార పరబ్రహ్మతత్వము అందరికీ అర్ధముకాదు, అందుబాటులో వుండదు. భగవంతుడు సర్వవ్యాపి, సర్వాంతర్యామి, కాలస్వ రూపుడు, కాలాతీతుడు. అగ్గిపుల్లలో మంటవున్నది, నిర్గుణముగా నున్నది. దానికి సాకారస్వరూపము నిచ్చిన. అది కార్యకర్మలను సాధించును. అట్లనే, నిరాకారము సాకారమైన, అజ్ఞానము దుర్గుణము మొదలగువన్నిటినీ భస్మముచేసి, మానవులతో స్వస్వరూపానుసంధానము చేయించి వారికిఆత్మానందమునందించు అవకాశమున్నది. దీనికే ధర్మసంస్థాపన అనిపేరు; దీనికొరకే సగుణసాకార అవతారము: "అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం" అనేది గీతావాణి. అవతారములవలన అధర్మ నాశనము ధర్మస్థాపన దుష్టశిక్షణ శిష్టరక్షణ ఈరెండూ జరుగును. అయితే, ప్రజలను హింసించే సంకల్పము భగవంతునికి యేనాడూ రాదు. లేదు. ప్రేమసందేశమును బోధించి దుర్గుణములను రూపు మాపుటే, వారిసంకల్పము. రాజకురుపువలన దేహమే పతనమయ్యే పరిస్థితి కలిగినపుడు, డాక్టర్లు ఆపరేషన్‌చేసి మహదుపకారము నందించురీతి, రామకృష్ణా ద్యవతారకాలమున, యుద్ధభూమిలో ఆపరేషన్ జరిగినది, అంతే. దేహమనే దేశమున కురుపు అనే

దుర్గుణము విపరీతమై పెరిగినపుడు డాక్టరనే సాకార శ్రీకృష్ణ భగవానుడు కాంపౌండరుగా అర్జునుని పెట్టుకొని ఆపరేషన్ స్వరూపమైన యుద్ధమును జరిపి దురహంకారమును నాశనముచేసి ఆరోగ్యము ననుగ్రహించిరి.

అవతారమూర్తి శ్రీకృష్ణునికి యెంత చక్కని పేరు! దానికి యెంత పవిత్రమైన అంతరార్థమున్నది! గమనించండి. కృషి, ఆకర్షణ. త్రికాలాబాధితానందము, ఈ అర్థములుమూడూ ఆపదమునకున్నవి. హృదయభూమినిదున్ని ప్రేమబీజములనునాటి ఆనందమును పండించేది కృష్ణావతారకార్యము; ఆబాలగోపాలు రందరినీ ఆకర్షించి వారిచిత్తముల నపహరించి మనోలయమొనర్చి కాపాడేమూర్తి; అని మరొక అర్థము. సచ్చిదానందస్వరూపుడు, మాటలతో పాటలతో ఆటలతో వేణుగాన మాధుర్యముతో ఆనంద మునందించినాడు కృష్ణుడు, భద్రభూమిలోనూ రుద్రభూమిలోనూ ఆనందగానమే ఆయనకలవాటు! మహాభయంకరమైన భారత యుద్ధక్షేత్రమున చక్కగా శాంతముగా నెమ్మదిగా గీతనుపాడినాడు, కృష్ణుడు. యుద్ధభూమియందుకూడ, ఆయన ఆనందస్వరూపుడే. గోపికలనూ గోపాలురనూ ఆకర్షించి వారిహృదయములలో ప్రేమనుపెంచి వారికి సచ్చిదానందస్వరూపుణ్ణి సాక్షాత్కరింప జేసినాడు. వారిహృదయమున చిత్తరువువలె హత్తుకొని వారిని ఉన్మత్తులుగాజేసినాడు. కృష్ణునిచిరునవ్వులు ప్రజలనాకర్షించి పరమా నందభరితులు గావించినవి. వారిలోని విషయతృష్ణ నశించి వారిలో కృష్ణ తృష్ణ తీవ్రమైనది. పాలు పెరుగు అమ్మేగోపికలు తాము వ్యాపారముచేయు పదార్థముల పేర్లను కూతవేయటము మరచి

గోవిందా దామోదరా మాధవా అని భగవన్నామములనే పలికి ధన్యులైరి.

లోకవ్యవహారములకై వినియోగించవలసినది విత్తము: అయితే, చిత్తమును పూర్తిగా భగవన్నిమిత్తమైన కర్తవ్యములను నిర్వర్తించేకొరకువినియోగించవలెను. మానవులు శ్రమలన్నియును అర్థకామములకొరకే వినియోగింతురు; మిగిలినరెండు పురుషార్థ ముల నార్జించేకొరకు వినియోగించువారు అరుదు, సంసారము భారమైనపుడు హృదయమున భగవంతుని భద్రముచేసుకొన్న, ధర్మాసక్తి బలపడి, జీవితముచాలా తేలికయగును. దీనిని బోధిం చుటయే అవతారముయొక్క కార్యము.

కృతయుగమున వేదసంరక్షణకై అవతారములు ఆవి ర్భవించినవి. త్రేతాయుగమున ధర్మసంరక్షణము ప్రధాన కా రణమైనది, అపుడు, ధర్మమూలమిదం జగత్, అనే సత్యాన్ని స్థాపించటమైనది. ద్వాపరయుగమున రాజ్యము అధికారము ఆస్తి పాస్తులు ధనకనకాదులు వీటికోసము కలహములు బయ లుదేరినవి, అవతారమువచ్చి, వాటినిన్యాయరీతిగ ధర్మమార్గము న పంచినది, ''ధనమూల మిదం జగత్'' అనేది అప్పటి ప రిస్థితి. అయితే, ఈకలిలో వేదము ధర్మము ధనము మూడిం టికీ భయమే, అపాయమే. ధరణి ధర్మపత్ని ధనము మూడింటికీ భయ భీతులే. కలియుగమందు శుద్ధ చిత్తములేదు, పవిత్ర భావములేదు, అయినను, హృదయ పరివర్తనకు సులభమార్గము లున్నవి. అగమ్యగోచర మైన విషయమును తెలిసి కొనుటకు

అల్పాయువు లైన అన్నగతప్రాణములకు కలిలో వీలు లేదు. అయిననూ, కించిత్ సాధనలోనే పెద్దలాభమును పొందవచ్చును.

ఇతరయుగములలో నూర్లకొలది సంవత్సరములు తపస్సాచరించి,కాయములను పుట్టలుగాచేసినతరువాతనే దైవానుగ్రహము, దైవసాక్షాత్కారము దొరకును. ధ్రువుడు, ఆరు సంవత్సరముల సర్వసంగ పరిత్యాగముచేసి, అరణ్యమునకేగి, కఠోరతపము జేసిన తరువాతనే, శ్రీమన్నారాయణుని ఆశిస్సులను పొందగలిగాడు. ఈకాలములో 50 సంవత్సరముల పెద్దవాడు, 5 నిమిషములుకూడ ధ్యానమగ్నుడై కూర్చొనలేక పోతున్నాడు. ఇంక, ఆయనకు భగవద్దర్శనము కాలేదే అని విసుగు, కోపము, విరాశ! లేతవయస్సుగల ప్రహ్లాదుడు తండ్రిపెట్టిన ఘోరహింసలకు కన్నులనీరుతేకు, భయకంప సమేతుడుకాకు మాటిమాటికి ఓ పన్నగశాయి, ఓ దనుజభంజన, ఓ జగదీశ ఓ మహాపన్నశరణ్య ఓ నిఖిలపావన యంచు నుతించును, అంతే!

మనసును మాధవుని పై మరల్చి, అన్ని పనులనూ అతని కైంకర్యముగా జేసితే, ఏబాధనూ వుండదు. దేహములోని బాధ, ఇంద్రియముల పిపాస వీటిని హృదయమునకు సోకకుండ భగవంతుని ప్రసాదమని స్వీకరించవలెను. భగవద్ధ్యానమే అత్యుత్తమమైన యోగము. ధ్యానము ద్వారా సర్వమునూ త్యాగము చేయుటకు బలముచేకూరును. 'ధ్యానాత్ కర్మ ఫలత్యాగం, త్యాగాత్ శాంతిరనంతరం'' ధ్యానమంటే, అంతర్ముఖప్రయాణము. సంకల్పము వలననే ఇంద్రియములు పనులు జరుపును. కాబట్టి,

సంకల్పము లన్నిటినీ భగవంతునికే అర్పితము చేసిన, సర్వేంద్రియములూ స్తంభించిపోవును. ఇంద్రియములకు వశుడైనవాడు బలహీనుడే కాబోలు. నాయమాత్మా బల హీనేన లభ్యః అని శ్రుతులు హెచ్చరించేది అతనిగురించే. ధ్యానములో మీరు కూర్చొన్నపుడు ఒక చిన్న ఈగ ఇంత పెద్ద దేహముపై వాలిన, తక్షణమే దానిని కొట్టే బుద్ధి పుట్టును. ఇది ఏకాగ్రతయొక్క లక్షణమా? ఇట్టి ధ్యానమువలన యేఫలితము దొరుకును? భగవంతుని లీలాగుణగణములను శ్రవణ మననాదులచే మనసులో నింబుకుని ఆతని అనుగ్రహమును పొందుటకు కలిలో వీలు లేదనుకో వద్దు. భగవద్దర్శనము పొంది తరించిన వాళ్లు కలిలో కూడ బహుమంది. చేసిన పాపములకు హృదయ పూర్వకముగ పశ్చాత్తాపబడి, కరుణాస్వరూపుడైన పరమాత్ముని, మంగళ స్వరూపుని, జ్ఞాననేత్రముచే సదా దర్శించి ఆ దివ్యానుభూతిలోని నిత్యానందము నందుకొన్న సూర్దాసు మొదలగు వారు వేలకొలది. గడచిన పాప కర్మలను మరచి రాబోయే ఆనందమును మాత్రము దృష్టియదుంచుకొని ప్రముదిత మనస్కులై చిత్త శుద్ధిని సంపాదించి జ్ఞానసిద్ధిని పొందవలెను. అపుడే జన్మ సార్థకత.

భగవద్గీతలోని అంత్య శ్లోకమును భగవంతం ఇప్పుడు తన వుపన్యాసములో వుదహరించినాడు కదా? దాని విశార్థమేమిటి? "యత్ర యోగేశ్వర: కృష్ణో, యత్ర పార్థో ధనుర్ధరః తత్ర శ్రీర్విజయో భూతిర్ ధ్రువా నీతిర్మతిర్మమ" కృష్ణుడు అర్జునుడు ఇద్దరూచేరితే జయము సిద్ధము అనేది బాహ్యార్థము.

అంతరార్థమేమి? కృష్ణుడు యత్ర "ఎక్కడ" వున్నాడనే ప్రశ్నలేదు, సర్వతః పాణిపాదం సర్వతోక్షి శిరోముఖం, ఆయన సర్వత్రవున్నాడు. అయినను వెతుక నక్కరలేదు. అర్జునుడు (నిర్మల చిత్తుడు) ధనుర్ధారియై (ధైర్య సాహసముతో శక్తిసామర్థ్యములన్నిటినీ యేక ముఖముగా వినియోగించిన) విజయము (మోక్షప్రాప్తి) సిద్ధించును. ఇదే ఆశ్లోకమున కంతరార్థము.

చిత్తశుద్ధి దృఢవిశ్వాసము ఇవిరెండు కలిగిన వారికీ యోగేశ్వరుడైన కృష్ణుడు నిస్సందేహముగా దర్శనమిచ్చి వెంట జంట అన్నివిధాల ప్రోత్సహించి పరమానందము ననుగ్రహిస్తాడు. కృష్ణుడు నమ్మినవాళ్లను తనలో చేర్చుకొనుటకు యెల్ల వేళలసంసిద్ధుడై వుంటాడు. అయితే మానవులు అర్జునులుగా తయారుకావటము లేదు, అంతే.

జన్మాష్టమి దినమందు శ్రీకృష్ణుణి మీమీ హృదయ స్థానమందు జన్మింపజేసికొనవలెను. విషయ తృష్ణనుంచి విడుదల పొంది కృష్ణతృష్ణను అభివృద్ధిజేసికోవలెను.

(శ్రీవారి దివ్యబోధ)

31-8-72



# సమరసము

మనస్సులోని యోచన, మాటలలోని సూచన, ప్రవర్తనలోని నిరూపణ మూడింటినీ సమరస పరచి ఏకమార్గమున ఆచరణయందు పెట్టినపుడే, మన కార్యములు కాని మన సంస్థల కార్యక్రమములు కానీ మనకు ఆనందమునందిచును. సంఘము యొక్క స్వరూపమును ఆత్మ స్వరూపముగా విశ్వసించవలెను. సమరసము సానుభూతి అనే భావములు హృదయమున లేనపుడు జీవితము నిరర్థకమై వ్యర్థమగును. సంఘ ప్రవర్తనల ద్వారా మనకు సర్వభూతాంతరాత్మమైన పరమేశ్వరుని సాక్షాత్కారము లభించవలెను.

సత్యసాయి సేవాసంస్థల తత్వము సర్వమత సమ్మతము. ఎట్టిమతములతో కాని ఎట్టి సంఘ సంస్థలతో కాని ద్వేషము విరోధము పైపోటి మనోభావమును మనస్సులోవుంచుకొనక, సర్వమతసమన్వయమును హృదయపూర్వకముగా విశ్వసించవలెను. ఆ విశ్వాసమునకు తగినట్టుగా ఆచరించుటకు పూనుకోవలెను.

ఈ నాడు లోకములో 'నాకు అన్నియు తెలుసునని విఱ్ఱవీగే వెఱ్ఱివ్యక్తులున్నారేగానీ, అహంకారభావముతో ఆకాశమునకు ఎగురుచున్నారేగానీ, ఆనందమునకు నోచుకోలేకపోవుచున్నారు. వారికి కారణము తెలియదు. అన్నియూ తెలుసుకొన్నవారైతే, ఆనందమున కెందుకు దూరము కావలెను; ఏదో ఒక లోపముండవలెనుకదా? మీలో అనేకమందికి తెలిసినవిషయమే. పరమానందయ్య శిష్యులలో ఎన్నిసార్లు లెక్కించిన ఒకడుతక్కువగా వున్నాడనే కథను మీరువిన్నారు కదా; ఆ ఒకడు ఎవడంటే, తనను తాను మరచినవాడే. ఎన్నిపర్యాయములు లెక్కించినా ఒకడు తక్కువగా వుండేది.

కనుక మనము చుక్కలను లెక్కించిననూ, చంద్రునిపై ఎక్కిననూ, మొదట మన తత్వమును మాత్రము మరువ కూడదు, మనలను లెక్కించుకొనక మన నిజమునుగుర్తించక అన్నియూ తెలుసుకొన్నవాడుగనే తయారైతే ఫలితము లేదు.

కనుక మొదట తనను తాను తెలుసుకొని, తన్ను తాను గుర్తించుకొనే ప్రయత్నమునకు పూనుకోవలెను. దీనికే ఆధ్యాత్మిక మార్గము అని పేరు. దేనిని మరచాలో దానిని మరచిన పిమ్మటే ఆనందం లభించును. దేనిని చేరవలెనో దానిని చేరినప్పుడే, ఆనందం లభించును. అంతవరకు ఈ ప్రకృతి కర్మలయందు ఎన్ని రకముల కర్తవ్యకర్మలనాచరించిననూ ఆనందం సంప్రాప్తం కానేరదు. ఇంక, మనము మరచవలసినదేమిటి? చేరవలసినది దేనిని? వీటినే అసతోమా సద్గమయ! తమసోమా జ్యోతిర్గమయ! మృత్యోర్మా అమృతంగమయ! అనే సూక్తులద్వారా ఋషులు బోధించినారు. అసత్ అయిన జగత్తును మరచిపోవలెను. తమస్ అయిన అహంభావమును వదలవలెను బ్రహ్మతత్వమైన అమృతత్వమును చేరవలెను.

(శ్రీవారి దివ్యబోధ)

దసరా మహోత్సవ కార్యక్రమముల సంపూర్ణ వివరములను నవంబర్ సంచికలో ప్రచురించు చున్నాము.

(సం)

# పుస్తక సూచి

1 పుస్తకముల వెలయూ పోస్టు మరియు రిజిస్ట్రేషను ఛార్జీలయూ మని యార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 విలువలోనున్న పుస్తకములు వాటి పోస్టు చార్జీలు క్రింద తెలియ జేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు. ప్రతి ఆర్డరుతోనూ రిజిస్ట్రేషను ఛార్జీ రూ. 1-05పై జతపరచి, కావలిసిన పుస్తకములను వివరముగా వ్రాసి పంపవలెను.

| | పేరు | వెల | టపాలచార్జీ |
|---|---|---|---|
| తెలుగు:—— | | | |
| 1. | సత్యంశివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2. | .. .. (2) | 4-00 | 0-45 |
| 3. | మణిమాల | 1-00 | 0-15 |
| 4. | భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5. | అర్పణ | 1-00 | 0-10 |
| 6. | సాయిరామ నామమహిమ | 1-00 | 0-10 |
| 7. | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8. | గీతా వాహిని | 4-00 | 0-40 |
| 9. | వచనామృతము | 4-00 | 0-30 |
| 10. | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 11. | సాయిరాముదేవరు | 1-00 | 0-10 |
| 12. | బోధామృతము | 0-50 | 0-10 |
| 13. | సాయిమహిమ | 1-00 | 0-20 |

| | | | |
|---|---|---|---|
| 15. | దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 16. | స్తుతి తరంగిణి (2వ భా) | 0-50 | 0-10 |

కన్నడం:——

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యం శివం సుందరం | 3-50 | 0-30 |
| 2. | జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 3. | ప్రశాంతి వాహిని | 1-50 | 0-10 |
| 4. | సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 5. | ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 6. | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 7. | ధ్యాన వాహిని | 1-50 | 0-10 |
| 8. | ప్రశ్నోత్తర వాహిని | 1-00 | 0-15 |
| 9. | గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:——

| | | | |
|---|---|---|---|
| 2. | 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3. | గీతావాహిని | 3-00 | 0-15 |
| 5. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 6. | అవతార మధురవాక్య | 2-00 | 0-20 |
| 8. | ధర్మ వాహిని | 1-00 | 0-10 |

ఇంగ్లీషు:——

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యసాయి స్పీక్స్ (1భా) | 4-00 | 0-25 |
| 2. | సత్యసాయి స్పీక్స్ (2భా) | 4-00 | 0 30 |
| 3. | .. .. (3భా) | 4-00 | 0. 30 |
| 4. | ,, .. (4భా) | 5-00 | 0-40 |
| 5. | .. .. (5భా) | 5-00 | 0-40 |
| 6. | .. .. (6భా) | 5-00 | 0-40 |

| | | |
|---|---|---|
| 7. „ .. (7భా) | 7-00 | 0-65 |
| 9. ప్రశాంతి వాహిని | 2-00 | 0-15 |
| 10. ప్రేమ వాహిని | 2-00 | 0-15 |
| 11. ఉపనిషత్ వాహిని | 2-00 | 0-15 |
| 12. సందేహ వివారిణి | 2-00 | 0-20 |
| 13. గీతా వాహిని | 4-00 | 0-35 |
| 14. జ్ఞాన వాహిని | 2-00 | 0-15 |
| 15. భాగవతవాహిని | 5-00 | 0-40 |
| 16. భజన్‌సాంగ్స్ | 2-00 | 0-20 |
| 17. ధ్యానవాహిని | 2-00 | 0-15 |

అరవం:——

| | | |
|---|---|---|
| 1. భగవాన్ శ్రీ సత్యసాయిబాబా అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 2. అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 3. సత్యం శివం సుందరం (1వ బా) | 3-50 | 0-40 |
| 4. .. .. .. (2వ బా) | 4-00 | 0-30 |
| 5. భజనావళి | 1-00 | 0-15 |
| 6. అవతారమొళిఅముదం (1వ భా) | 3-00 | 0-30 |
| 7. „ „ (2వ భా) | 3-00 | 0-35 |
| 8. సాయిమాత | 1-00 | 0-10 |
| 9. ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 10. సందేహవివారిణి | 2-00 | 0-25 |

హిందీ: ——

| | | |
|---|---|---|
| 1. సత్యసాయీశ్వరాయనమః (పద్యములు) | 1-00 | 0-10 |
| **బెంగాలి:——** | | |
| 1. ధ్యానవాహిని | 1-75 | 0-10 |
| **గుజరాతి:——** | | |
| 1. అమృత్ వాహిని | 2-00 | 0-20 |
| 2. కథాసుధ | 2-00 | 0-15 |
| **సింధి:—** | | |
| 1. భజనావళి | 0-50 | 0-10 |
| 2. ధ్యానవాహిని | 1-00 | 0-15 |

మేనేజర్, సనాతన సారథి.

## గమనిక — పత్రికల చందాలు, పుస్తకముల అర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు మరియు ఇంగ్లీషు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా : 4రు|| ఒక సంవత్సరము నకు తక్కువకాని 5 సం||ల కెక్కువకాని చందాలు స్వీకరింపబడవు.

2. చందాలను పంపించునపుడే ఈక్రింది వివరములను సుస్పష్టముగా తెల్పవలెను.

ఎ) మొదటిసారిగా చందాలను పంపేవారు "క్రొత్త చందాదారు", అని వ్రాయవలెను.

బి) ప్రస్తుతచందా గడువు పొడుగించుటకు, తనచందానెంబరుతో చందాపంపించు విష యమునందే తెలియజేయవలెను.

సి) తెలుగు పత్రికకావలెనో లేక ఇంగ్లీషుపత్రిక కావలెనో స్పష్టముగా వ్రాయవలెను.

డి) చందాదారు తన పేరుపూర్తి విలాసమును స్పష్టముగా తెలియునట్లు వ్రాయ లెను. M.O. ద్వారా చందాసుపంపించువారు వారిపేరును పూర్తి విలాసమును M.O. కూపను వెనుకభాగమున వ్రాయుట అత్యావశ్యకము.

3. పత్రికలుగాని పుస్తకములుగాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటివివరములను పైకముతోపాటుగా తెలియపరచవలెను. M.O. ద్వారా పైకమును పంపించువారు కూపనులోనేకావలసినపుస్తకముల వివర ములను తెలియజేయవలెను.)

4. పత్రికకుగాని పుస్తకములకుగాని పైకమును పంపించువారు తమచెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను. "సనాతన సారథి", ప్రశాంతినిలయం పోస్టు. అనంతపురంజిల్లా, ఆంధ్రప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు బ్యాంకిఖర్చులనుకూడా కలిపి, మొత్తమును పంపవలెను. పత్రికగాని, లేక. పుస్తకములుగాని చెక్కుపైకము వసూలైన తరువాతనే పంపించబడును.

5. పైవిషయములకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరములను "మేనేజరు, సనా తనసారథి, ప్రశాంతినిలయంపోస్టు, అనంతపురంజిల్లా. ఆంధ్రప్రదేశ్ అనుచిరునామాకు వ్రాయవలెను అట్లువ్రాయు ఉత్తరప్రత్యుత్తరములలో తమచందానెంబరును లేక ట్రంక్ ఆర్డరునెంబరును, తప్పక వ్రాయవలెను, అట్లు వ్రాయనియెడల జవాబులిచ్చుటకు ఆల స్యమగును.

6. పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

ఆంధ్రప్రదేశ్ అనంతపురంజిల్లా ప్రశాంతినిలయమునందలి శ్రీ సత్యసాయి ముద్రణాలయ మునందు యన్. కస్తూరి గారిచే ముద్రింపబడి బి.వి.రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి ట్రస్టు తరఫున ప్రచురింపబడినది. యెడిటర్, యన్. కస్తూరి యం. ఏ., బి. యల్.

